శ్రీ

శ్రీ లక్ష్మీనరసింహాయనమః.

# నరసింహశతకము.

దండకము, పంచరత్నములు,

లక్ష్మీనరసింహ యోగివారి సీసమాలిక



గ్రంథకర్త

భాస్కరుని వీరరాఘవ శాస్త్రి

శ్రీ

శ్రీ ఉగ్రనరసింహస్వామినే నమః

శ్రీ లక్ష్మీనృసింహ యోగీంద్ర సద్గురు పరబ్రహ్మణే నమః

మార్కాపురం తాలూకా వున్నాడివర

# ఉగ్ర నరసింహ శతకము

దండకము, పంచరత్నములు,

లక్ష్మీనరసింహ యోగివారి సీసమాలిక.



భాస్కరుని వీరరాఘవ రావుచే

రచియింపఁబడినది.

 [వెల రు 0-4-0.

శ్రీరామ శుభమస్తు.

# శ్రీ నరసింహ శతకము.



## కందములు

శ్రీ రమణీధవ వామన
సారసదళనేత్ర చక్రి సర్వేశ హరీ
మారజనక మందరధర
క్షీరాబ్ధివిహార బ్రోవు శ్రీనరసింహా 1

ఉమ్మడివరగిరినిలయా
నెమ్మది నిను నమ్మినాడ నీరజనాభా
సమ్మతితోడుత నీశత
కమ్మును త్వరపూర్తిజేయు కరుణ నృసింహా 2

మురసంహార ధరణీధర
కరుణాకర వాసుదేవ కాంచనచేలా
కరివరద పూతనాంతక
స్థిరముగ రక్షింపుమయ్య శ్రీనరసింహా 3

స్వామీ, లక్షణమెఱుఁగను
కామజనక నీదు భక్తి గలుగుట చేతన్
నీమమునఁ జెప్పఁ బూనితి
వామన తప్పులను గావవలయు నృసింహా 4

మీనమవై యంభోనిధి
లోన మునిఁగియున్నయట్టి లుఘ్ఛ్రదనుజున్
పూని వధించియు శ్రుతులను
మానుగ విధి కొసఁగు దేవమాన్య నృసింహా 5

అంబుధిని ద్రచ్చుతరి గిరి
యంబుధిలో మునుఁగువేళ నతిశీఘ్రముగా
త్ర్యంబకసఖ కూర్మమవై
సంబరమున శైలమెత్తుస్వామి నృసింహా 6

హైరణ్యనేత్రుఁ ద్రుంపఁగ
ధీరత కిటిరూపమెత్తి తెంపుదలిర్పన్
క్రూరుఁడగు దనుజుఁ జంపిన
కారణ జన్ముఁడవు నీవు గావె నృసింహా 7

బాలకుని బ్రోచుకొఱకై
వాలినస్తంభంబు వెడలి వ్రగ్రత దనుజున్
లీల దునిమి ప్రహ్లాదుని
యేలినదొర వీవుగావె యీశ నృసింహా 8

కడుచిన్నవాఁడై బలి మూ
డడుగుల భూమిమ్మటంచు నతిచతురతతో
నడిగియు రాజ్యముఁగొని తుద
కడుగున బడద్రోయవే మహాత్మ నృసింహా 9

పరశువును బట్టి రాజుల
నిరువదియొకమారు తెగి హింసించి వెసన్
ధర విప్రుల పాల్జేసిన
స్థిరజీవివి పరశురామ దేవ నృసింహా 10

శ్రీరాముఁడనఁగ నడవిని
శూరతతో నేఁగి రక్కసుల పెక్కండ్రన్
నేరుపున సంహరించిన
సారసనాభుఁడవు నీవె స్వామి నృసింహా 11

బలరామ కృష్ణులనఁ గను
యిలలోపలఁబుట్టి త్రేత తెల్లఁగనుఁగొనఁగ
బలిమిని పర్వతమెత్తిన
విలసితుఁ డవు నీవెగద నృవీరనృసింహా 12

సాక్షిగను నిలచి జనులను
పక్షంబొక ప్రక్క లేక బహువిధములతో
రక్షించు బుద్ధరూపము
సాక్షిగమన నీవుగావె పరమ నృసింహా 13

కలియుగము బోవువేళల
నిలలోఁగల జనులు పెక్కు యిడుములబడఁగన్
కలికావతార మెత్తియు
సలలితముగఁ బ్రోచునట్టి స్వామి నృసింహా 14

కపిలుండనఁగాఁ బుట్టియు
కృపతోడుత దేవహూతి కొప్పుగ తత్త్వం
బుపదేశించిన వాఁడవు
చపలాత్ములఁబ్రోవు మమ్ము స్వామి నృసింహా 15

దత్తాత్రేయుఁడవై ధర
యుత్తమమగునట్లు జ్ఞాన మొప్పఁగఁ బ్రజకుఁ
హత్తించియు రక్షించిన
చిత్తజజనకుండ వీవె శ్రీనరసింహా 16

పరమాత్మ నీదు లీలలు
తరమా వర్ణింపవిధికి తత్త్వజ్ఞనిధీ
సరగునను వచ్చి బ్రోవుము
సిరిధవపరమాత్మ కృష్ణ శ్రీనరసింహా 17

వరమిమ్మని నిరతము నిను
మరువక శరణంబువేడు మానవతతిని
నిరతము గాఁచెదవఁట శ్రీ
పురుషోత్తమ బ్రోవుమయ్య పూజ్య నృసింహా 18

ఆకాశ వాయు తేజము
ప్రాకటముగ భూమి జలము బహువోషధులున్
వీకను అన్నము ప్రాణులు
శ్రీకర నీయాత్మగాదె శ్రీ నరసింహా 19

జ్ఞానేంద్రియంబులాదిగ
మానుగ తొంబదియు నారు మహిలోఁ గూడన్
ధీనుత తత్త్వమవగు సా
క్షాన్నారాయణుఁడ వీవె స్వామి నృసింహా 20

అరువదినాలుగు విద్యలు
ధరలోఁ నిరువదియునైదు తత్త్వంబులు శ్రీ
కర యాబదారు వర్ణము
లిరువదియాఱ్ఛందములును యీవె నృసింహా

ప్రాడ్భాయి రక్కసుల గమి
కడ్భీతులఁ జేసి దేవగణములు యెల్లన్
షడ్భాదలు వారించెడి
షడ్భావ వికారదూర స్వామి నృసింహా 22

ఆధార మాదిగా గను
సాధు నుత సహస్రకమల చక్రము దనుకన్
మాధవ నిలచితి వీవే
శ్రీధర వర్ణింపఁ దరమె శ్రీ నరసింహా 23

మూలాధారము నందున
నాలుగు దళముల వ శ ష స లన్వర్ణములన్
నోలిన్ కుంకుమ ఛాయను
లాలిత గజముఖుఁడ వీవె లక్ష్మి నృసింహా 24

స్వాధిష్ఠానం బందున
శ్రీదైతుఁడ బ భ మ య ర ల చిన్మయ రూపం
బూదియు షడ్దళముల విధి
వైదనరియు మెఱపు కాంతి యమరు నృసింహా 25

ఘనడఢణ తథదధనపఫ
లనువర్ణము లొప్ప దశదళాకారంబై
మణిపూరకంబు శ్యామల
మున నీచే రక్షితంబు ముగ్ధా నృసింహా 26

కాదిన్ ఠాంతమువరకును
వాదరహిత పదియు రెండు వర్ణదళములన్
శ్రీద యనాహతమందున
సాదరమున శివుఁడనంగ జను నరసింహా 27

షోడశ దళముల నాదుల
గూడి విశుద్ధంబనంగఁ గొమరొందిన యా
వాడను జీవుఁడవీవై
పీడక స్ఫటికప్రకాంతి వెలుఁగు నృసింహా 28

ఘన యాజ్ఞేయము హంక్షం
బనువర్ణము లొప్ప ద్విదళమై పరమాత్మం
డనునీచే పాలితమా
జనసుత మాణిక్యకాంతి స్వామి నృసింహా 29

శ్రీహరి వెయిదళముల హం
సోహంయను యక్షరముల సూక్ష్మత ఖగరా
డ్వాహన గురువను నీచే
సాహస్రము చిత్రికళల జను నరసింహా 30

ఇరువదియొక వెయి యార్వ
ద్దిరుగును దినమునకు హంస తీవ్రము గాఁగన్
పరమాత్మ నీకు హంసను
స్థిరముగ నర్పింప ముక్తిఁ జెందు నృసింహా 31

ఖర మత్సరంబు నీవై
హరిపరతత్త్వంబవగుచు నన్నివిధములన్
సరిసెఱుఁగ లేనివస్తువు
స్థిరరూపా నీవుగావె శ్రీనరసింహా 32

గంగా యమున సరస్వతి
పొంగుచుఁ జెలువొందు చోట పూనిక దృష్టిన్
రంగుగనిల్పినఁ గన్పడు
రంగఁడవీవెగద బ్రోవరా నరసింహా 33

చిత్కళలు నాశమైన చ
మత్కారము తోడవెలుఁగు మాన్యుఁడవీవే
మత్కామితముల నొసఁగుము
సత్కరుణాకర మహాత్మ స్వామి నృసింహా 34

మూలాధారంబాదిగ
నోలి సహస్రారచక్ర మందెడివటుకున్
చాలుగనుండెడి కుండలి
మేలుకొలుప నాడుచుండు మించి నృసింహా 35

యోగంబులు భోగంబులు
త్యాగంబులు యాగములును యరసి సరిగనన్
రాగరహిత నీ మాయయె
సాగరమదహరణ బోధిపు స్వామి నృసింహా 36

రవి ఘట జలముల వేరుగ
భవనాశన గానఁబడియు వారక నొకఁడై
దివివెలుఁగు మాట్కి హరిమా
ధవ నీ వొకఁడవుగావె తగ నరసింహా 37

బంగారమొక్కటయ్యును
రంగొప్పగ భూషణములు రాజిలుపగిదిన్
మంగళ వొక్కఁడవై బహు
భంగుల విలసిల్లు గాక వరద నృసింహా 38

కన్నులు నాసాకర్ణము
లన్ని యనామకము తర్జ నాంగుష్ఠములన్
పన్నుగ మూసియు నిక్కన
మిన్నున గన్పడెడి శంభుమిత్రి నృసింహా 39

కనుబొమల మధ్యమందున
ఘనమై చెలువొందునట్టి కమలములోనన్
సనువగు త్రికుండలంబుల
గను మించియు వెలుఁగునట్టి గురు నరసింహా 40

ప్రణవ స్వరూపమైతివి
అణువైతివి నాదబిందువైతివి కళవై
జననమరణములు లేకను
ఘన సోమార్కుల నెలసి తివి నృసింహా 41

మాయా సహితుఁడ వనియును
మాయాతీతుండ వనియు మహిలో జనముల్
పాయక వాదనఁజేతురు
నీయెడ యెట్టిమాయ జెంద నేర్చు నృసింహా 42

శ్రీమన్నృసింహ వామన
కామితఫలదా ముకుంద గరుడధ్వజ ని
న్నేమరకఁగొల్చు వారికి
స్వామీ తాపత్రయములు సమయు నృసింహా 43

భవ బాధంబులు దొలఁగును
శివములు చేకురును భక్తిచేఁ గొల్వఁగ శ్రీ
ధవ వృశ్చి కాగ్ని బాధలు
భువిలో నశియించు గద సుపూజ్య నృసింహా 44

అల వైకుంఠ పురంబున
లలనామణి గూడియుండ లలి సనకాదుల్
విలసితముగఁ నినుజూడఁగ
వలనొప్పగ వచ్చువేళ వారి నృసింహా 45

జయవిజయు లడ్డు సేయఁగ
దయసుంతయు లేక దైత్యతతి బుట్టుఁడు నాఁ
భయమొంది వేడ మిక్కిలి
దయతో వారలను గాంచి తగ నరసింహా 46

కరుణించి మూఁడుజన్మల
పురు శత్రుత్వమున మిమ్ము నొజను నాలో
సరిఁజేర్చుకొందు పొందన
ధర దితి గర్భమునఁబుట్టి దగ నరసింహా 47

లోకంబుల బాధింపఁగ
వీకను కిటిరూపమెత్తి వేగమె యొకనిన్
పోకార్చ హేమకస్యపుఁ
డాకొను పులిబోలె మిమ్ము నరయ నృసింహా 48

లోకంబు లన్నిదిరిగియు
యెకడ మిముఁ గానలేక యీర్ష్యా మతియై
లోకేశుల బాధింపఁగ
వీకను మిము దేవతాళి వేడ నృసింహా 49

ప్రహ్లాదుని బుట్టింపఁగ
మహదానందమున మిమ్ము మఱిగీర్తింపన్
సహియింపలేక నాతఁడు
బహువిధముల బోధఁజేసి బడలి నృసింహా 50

పలువిధములఁ బాధింపఁగ
సలలితముగ మీదుమహిమ సాధుహృదయునిన్
లలిబాధఁ జెందకుండిన
వచనోప్పఁగఁ రౌద్రమూది వాఁడు నృసింహా 51

హరి యెవ్వఁడు యెటనుండును
హరియింతును వాని నిన్నుయని గర్జింపన్
సరగున స్తంభము వెల్వడి
బొరిఁగొని రక్కసుని బాలుఁ బ్రోచి నృసింహా 52

శాంతించి బాలు రాజ్యము
నెంతయుఁ జేయుమని జెప్ప నేసిపపముల్
చింతింతు గాని భోగము
సుంతైనను వల్లనని జూచి నృసింహా 53

ఇప్పటికి రాజ్యమేలుము
తప్పక కలియుగమునందుఁ దగ నా సేవన్
యొప్పుగఁ జేయఁగఁగలవని
జెప్పిన నారీతిఁ జేసె జెలఁగి నృసింహా 54

వేదంబులు శాస్త్రంబులు
మోదంబున మిమ్ము వేడి మునుకొని మాపై
యాదరమున నిల్వవె యన
సాదరమున యొప్పుకొనవె స్వామి నృసింహా 55

గంగాయమున సరస్వతి
పొంగుచు మాచేత మీరు పూజింపంగా
బంగారు వరమునిమ్మా
రంగాయని వేడ కరుణ రాజనృసింహా 56

మీకోర్కెఁదీర్తుఁ బొండని
ప్రాకటముగఁ జెప్ప వేదరాశియు శాస్త్రి
నీకము శైలపు రూపై
పీకను నుమ్మడిగనుండు వెలసె నృసింహా 57

ఉమ్మడిగా వరమిచ్చుట
ఉమ్మడివర శైలమనఁగ నొప్పెనునామం
బిమ్మహి వేదము శాస్త్రము
సమ్మతితోఁ గూడె శైలసరణి నృసింహా 58

ఆ పర్వతంబు ప్రాగ్దిశ
పాపరహిత గంగ యమున భారతి కంల్లే
ర్నాపరగయు ప్రవహించెను
తాపసవందిత రథాంగధర నరసింహా 59

ఆకొండపైన నీవును
ప్రాకటముగ నుగ్రముగను బహుసుందరతన్
శ్రీకర నిలచితి వెంతయు
రాకాశశివదన బ్రోవరా నరసింహా 60

కలియుగము ప్రాప్తమైనను
లలి పాపము ప్రబలమైన లాఘవవేళన్
నిలఁబ్రోవ భక్తిసేయుఁగ
విలసిలి ప్రస్తాముఁజేపుడు వేదనృసింహా 61

సాబామువారి వంశము
సన్బాగుఁగ నుద్భవిల్లినటు శాల్యమునన్
శాబాసని జనులెన్నఁగ
దాబాగుఁగ నీకుభక్తిఁ దగిలి నృసింహా 62

లక్ష్మీనృసింహుఁ డనఁగను
లక్ష్మీధవు కరుణఁజేసి లలిసగ్గుణుఁడై
సూక్ష్మంబు లెల్లఁగనుఁగొని
లక్ష్మిని నిరసించి జని యెలమి నరసింహా 63

రాఘూవధూతనా నొక
శ్రీమహితుని భక్తిఁజేసి శీఘ్రమెవారిన్
నీమమున నెంచఁబడించియు
ధీమసమున తత్త్వమెఱిఁగి ధీరనృసింహా 64

హిమవంతం బాదిగఁగల
సుమహిత దేశములఁదిరిగి సురుచిరలీలన్
క్రమమున నుమ్మడివరగిరి
సమరసమున జేరె నంత స్వామినృసింహా 65

ప్రాకార దేవళంబులు
నీకను బాగుఁగనొనర్చి వేవేగమె నిన్
సాకల్యంబుఁగఁ గొల్చుచు
శ్రీకరయట నిల్చెగాదె శ్రీనరసింహా 66

అండజవాహన నదివా
ర్నిండారు ప్రపత్తితోడ నిత్యము నీకున్
మెండుగ నభిషేకాదులు
దండిగ యొనరించుగాదె తగ నరసింహా 67

ఎందటికో భక్తులకును
సందేహముఁబాపి ముక్తి సరసకుఁ జను యా
సందును దెలిపియు హృదయము
లందున నీభక్తినెటుపె నయ్య నృసింహా 68

కనుమూసిన కనుదెఱచిన
ననువగు నీరూపమెప్పుడు హత్తిన మనముల్
వినుతించు జిహ్వ నీపుఁ
జనముల నొసరించు హస్తచయము నృసింహా 69

కలియుగ ప్రహ్లాదుండని
యిల జనులెల్లఱును దెలియు యీర్ష్యాదులఁ దా
బలు విడచియు నిష్కలుషత
విలసిల్లెను యోగియంత వీరనృసింహా 70

చోళుండను రాజేంద్రుం
డోలిఁ బైశాచబాధ నొయడికొట్టకె
లీలఁ సహస్రయాత్రలు
తాలిమిసేవించి యొక్కతరి నరసింహా 71

మీమీఁద భక్తిచేసియు
నీమముతో నీదుసేవ నెఱపినకతనన్
దా మాయమగుచుఁ బోవదె
స్వామీ యాబ్రహ్మహత్య ప్రభునరసింహా 72

నేత్రములు పోయి విప్రుఁడు
ధాత్రీతల మెల్లఁదిరిగి తగనీకడకున్
యాత్రమున వచ్చి యేటను
గాత్రము ముంచంగ రావె కనులు నృసింహా 73

నేత్రములు వచ్చినంతనె
నేత్రావతి యనుచు జనులు నిర్మలమతులై
స్తోత్రములు సేయసాగిరి
చిత్రముగఁ నీదు మహిమ శ్రీనరసింహా 74

కేశవ సమస్తగ్రహములు
నీశక్తిని విన్నయంత నీరైపోవే
శ్రీశంకరసఖ భవహర
శ్రీశ మహాత్మా మురారి శ్రీనరసింహా 75

నారాయణ నీనామము
పారాయణ సేయువారి పాపములెల్లన్
దూరంబు జేరు టరుదే
సారసదళనాభ కృష్ణస్వామి నృసింహా 76

మాధవ నిను మదినమ్మిన
భూ ధన పుత్రాభివృద్ధిఁ బొందుదురుగదా
సాధుజనవినుత దయతో
బాధలు కడఁద్రోలి బ్రోవు ప్రభునరసింహా 77

గోవింద నిన్ను దలఁచిన
పావనమా జన్మలెల్ల భవపాశహరా
శ్రీవనితాధవ బ్రోవుము
ధీవర కరుణాలవాల దేవ నృసింహా 78

వ్యాపించి సర్వమందున
రూపింపఁగ రానియట్టి రోచిష్ణుఁడవై
కాపాడుచుందు కితమున
పాపరహిత విష్ణువనఁగఁ బరఁగు నృసింహా 79

మధుసూదన నిను బొగడిన
సుధగారెడి నీదుమోము జూడఁగఁ గల్గున్
బుధనుత నినుగనుఁ గొనఁగా
విధి రుద్రులకైన వశమె వీరనృసింహా 80

త్రైవిక్రమ నీనామము
పావన మొనరించుగాదె పద్మదళాక్షా
కావఁగఁగదె భక్తాళిని
ధీవర పరమాత్మ దివ్యదేహ నృసింహా 81

వామన భవహర నిను మది
నీమంబున వేయువారి నిరతము దయతోఁ
గామితములిచ్చి బ్రోతువు
కామజనక వేగవచ్చి కావు నృసింహా 82

శ్రీధర భవహర కేశవ
భూధర కరుణాలవాల పూతచరిత్రా
సాధుచరిత నీపాదము
లాధారములనుచుఁ గొలుతునయ్య నృసింహా 83

వరద హృషీకేశ గదా
ధర వజ్రనఖాయుధ తీక్ష్ణదంష్ట్రియ హరీ
మురహర రథాంగపాణీ
యురుగుణఖని బ్రోవుమయ్య యుగ్రనృసింహా 84

కమలము నాభినిగల నిను
కమలాసనుఁడాది సురలు గానఁగలేక
భ్రమఁజెంది మోసపోయిరి
కుమతిని నేనెంత గనఁగ గురునరసింహా 85

దామోదర నారాయణ
నీమహిమ లెఱుంగ వశమె నిగమస్తోత్రా
కామజనక కరుణాకర
సామజరక్షణ ముకుంద స్వామి నృసింహా 86

సంకర్షణ సర్వేశ్వర
పంకరుహదళాక్ష విష్ణు భవహర కృష్ణా
లంకాధినాథ శిక్షణ
సంకటముల నెల్లఁ బాపు స్వామినృసింహా 87

నీసరివేల్పు మఱ్ఱెవరు
వాసవవందిత మహాత్మ వసుదేవసుతా
శ్రీసత్యరూప కేశవ
భాసురముగ వచ్చిబ్రోవు ప్రభునరసింహా 88

ప్రద్యుమ్న నీకుమహిమను
నాద్యంతముఁ గనుగొనంగ హరునకు వశమా
ఖద్యోత చంద్రనేత్రా
విద్యోత తనుఃప్రభావ వీరనృసింహా 89

అనిరుద్ధ నీదునామము
మనమున మననముయొనర్ప మానవతతికిన్
ఘనమగు సంపదలిచ్చెడి
సనకాద్యర్చిత ముకుంద స్వామినృసింహా 90

పురుషోత్తమ పురహరసఖ
కరుణాకర పద్మనాభ కాంచనచేలా
నిరతము నినుభజియించెద
నురుగుణనిధి బ్రోవుమయ్య యుగ్రనృసింహా 91

శ్రీకర యధోక్షజా నిను
ప్రాకటముగ గొల్చువారి పాపములెల్లన్
బోకార్చెదవని వింటిని
రాకాశశివదన బ్రోవరా నరసింహా 92

హైరణ్యకస్యపాంతక
వారిధిశయనా మహోగ్రవజ్రనఖ హారీ
మారజనక పరమేశ్వర
భూరికృపామయ మహాత్మ పూజ్యనృసింహా 93

సిరిధవ కేశవ నిను మది
మఱువక సంస్మరణసేయు మానవతతికిన్
వరముల నొసఁగియు జననము
మరణములనుమాన్పు దేవమాన్య నృసింహా 94

మనమున నిన్ను స్మరించియు
మునివంద్య జనార్దనాఖ్య పురుషవరేణ్యా
యెనిమిది మదముల నణచిన
ననువుగ కైవల్యపదవి నందు నృసింహా 95

కాపాడుమయ్య భవహర
నీపాలను బడినయట్టి నిశ్చలమతులన్
తాపసవందిత కేశవ
పాపహరణ శ్రీయుపేంద్ర ప్రభునరసింహా 96

హరి వాసుదేవ కేశవ
మురహర ప్రద్యుమ్న కృష్ణ ముమ్మడివరమాం
దరసియు శైలాగ్రంబున
స్థిరముగ నివసించునట్టి శ్రీనరసింహా 97

శ్యామలవర్ణ జనార్దన
నీమహిమను తెలియంగవశమె నిగమస్తోత్రా
సామజరక్షణ కేశవ
వామన శ్రీకృష్ణదేవ ప్రభునరసింహా 98

అండజవాహన కేశవ
పండితపోషణమహాత్మ భవహరి శౌరీ
మెండగు భక్తిని నేపూ
దండగ నర్పింతు పద్యతతి నరసింహా 99

కరుణనుగాని యుందునగల
నెరసుల మన్నించి కావు నీరజనాభా
తరమగునె నిన్ను పొగడఁగ
సిరిధన పరమాత్మ కృష్ణ శ్రీనరసింహా 100

ప్రతి వత్సరంబు నిను స
న్నుతి జేయఁగవచ్చునట్టి సూరార్వేలా
యతిభక్తి యుతులఁ బ్రోవుము
సతి సుత భాగ్యములనిచ్చి స్వామినృసింహా 101

భక్తార్తిభంజన హరీ
శక్తికొలఁది నీదు సేవసల్పెడివారిక్
భుక్తియు ముక్తియు నిచ్చియు
రక్తిని రక్షింపుమయ్య రాజ నృసింహా 102

నరసింహయోగిఁ బోలిన
వరభక్తుఁడు నిన్నుబోలు వరదుఁడుగలఁడే
సుర గరు డోరగవందిత
పురుషోత్తమ బ్రోవుమయ్య పూజ్యనృసింహా 103

హరి శాలివాహశకమున
వర శృతి శర వసు శశాంక వత్సరములదా
స్థిరమగు ప్రజాపతాబ్దము
గరిమను శతకంబుపూర్తి గాంచె నృసింహా 104

వైశాఖ శుద్ధమందున
శ్రీశా నీవుద్భవంబుఁ జెందిన దిన మం
దీశతకము నీకిచ్చితి
నోశంకరమిత్ర బ్రోవు ముగ్రనృసింహా 105

ఈశతక మెవ్వరైనను
దాశరథికిఁ దగినయటులఁ దగచదువ వినఁగా
శ్రీశ సిరులిచ్చి బ్రోవుము
శ్రీశంకరమిత్ర కృష్ణ శ్రీనృసింహా 106

వరవీర రాఘవాఖ్యుఁడ
హరి నీదగు సేవకుఁడను యుచితముగనీ
చరణముల కర్పణంబుగ
సరగున నర్పింతు పద్యసమితి నృసింహా 107

మంగళము నీకు మాధవ
మంగళమగు నీకు దేవ మంగళరూపా
మంగళము నీకు భవహర
మంగళమిదె గొనుము సర్వమాన్యనృసింహా 108

సర్వం శ్రీలక్ష్మీసమేత ఉగ్రనరసింహార్పణమస్తు.



# శ్రీ నరసింహ దండకము.



శ్రీమన్మహా నారసింహా నమంబ్రోస్తు మోదేవదేవా జగద్రక్షకా యీశ సర్వేశ శ్రీ శాంకరీనాథుండుం బ్రహ్మ, శేషాహి వాగీశులుం బొంచలేనట్టి నీకీర్తి వర్ణింప నేనెంతవాఁడం జడా త్ముండ క్రూరుండ దీనుండనైనట్టి నానేరముల్ బాపి నం బ్రోవకున్నం మఱిం బ్రోవువారెవ్వ రింకం దయాళుండవై బ్రోవవే మున్ను నీ వెం డటోభక్తులం బ్రోచినావంచుఁ జెప్పంగ నేవిందు

నావార్తలన్ గల్లగాకుండ నన్గావు నీభక్తుఁడై నట్టి ప్రహ్లాదు చందంబునన్ జూడు మల్లప్పుడన్ జన్మ భంజించినావంచు నీమీఁది వైరంబునన్ దైత్య నాథుండు ధాత్రీతపంబందు మెప్పించిన న్వచ్చి దాగోరుగోర్కుల్ యతండివ్వ వాఁడంతగర్వంబు చే విష్ణు వెచ్చోట నున్నాఁడగ్గక్కజూచి భంజింతు నంచున్ గదాహస్తుఁడై మూడు లోకంబులన్ జూడ మీరెందు గానంగరాకున్న అజ్ఞాన గాఢాంధ కారుండు మీరోడినారంచుఁ దానెంచి యాదేవతాబృందమున్ విప్రబృందంబు స్త్రీబృందమున్ బాధపెట్టంగ మీరంత నాదుష్టు శిక్షింపఁ గా నెంచి హైరణ్యగర్భుండు మున్నిచ్చియున్నట్టి వాక్యంబులన్ నిల్పనూహించి ప్రహ్లాదు బుట్టించినవాఁడు శ్రీవిష్ణువే దేవుఁడంచున్ స్మరించంగ నామాట లాదుష్టు కర్ణంబులన్ ముల్కులై నాటి యాబాలు కట్టించి కొట్టించి కాల్పించిన న్వాసుదేవా హరీ కృష్ణ యీశా జగన్నాథ యంచున్ మిముందల్చ ప్రహ్లాదునే బాధ బాధింప

లేకున్న నద్దానవుం డప్పు డున్మత్తుఁడై పుత్త్ర యు
ష్వంతు విష్ణుండు యెచ్చోటనున్నాఁడు నేనాతనిన్
జంపఁగా నెంచి ముల్లోకముల్ జూడఁ గానంగ రాఁ
డయ్యె నీవట్టిచోరున్ మహాదేవుఁ డంచున్ స్మరిం
చంగ నెట్లౌను నాకన్న దేవుండు వేరెవ్వరున్నారు
రా యన్న నోతండ్రి శ్రీవిష్ణు వెచ్చోటఁగన్గొన్న
నచ్చోట నేయుండు నీయందు నాయందు నిశ్శబ్దుఁ
డున్ నిర్వికారుండు నిర్ద్వంద్వుఁడై నిల్చియున్నాఁడు
లోకంబు లోకస్థులున్ లోకనాథుల్ నశింపంగ
నేకస్థుఁడై చీకటింవెల్గు నద్దేవునిందింప నెట్లొప్పు
నన్నం యతం డోరి మాహాత్మ్య మెచ్చోట గన్గొ
న్న నచ్చోట నేయుండు సర్వాత్ముఁడీలోహపున్
కంబమందుండె నేనిన్ నినున్మ్రచ్చి యాఢీరు భం
జింతు నంచున్ సురారాతి గర్జించు వాక్యంబు
లున్ బాలు సద్భక్తియున్ జూచి మీరప్పు డా
త్యంతమున్ లేక సర్వంబునన్ నారసింహావతారం
బుతో నుండు నాపట్ల నోరాక్షసాధీశ శ్రీవిష్ణు
వీ స్తంభమందుంట కేమైన సందేహమున్ లేదటం

చున్ సుతుండంత చెప్పంగ రౌద్రంబునన్ అట్టహాసంబుతో లేచి ఓరోరి శ్రీ కేశవుం డింపు లేకున్న నీకంఠమున్ న్నాదుఖడ్గంబు పాల్జేతు రాయంచు దా వామ హస్తంబునన్ స్తంభమున్ వేసియు నాదెబ్బ కా స్తంభమున్ బ్రద్దలై యందు చక్రాదిశార్ఙ్గంబులన్ బూని అత్యుగ్ర రూపంబుతోనుండు నిన్ జూచి దైత్యుండు ఆశ్చర్యమున్ భీతియున్ జెంది ధైర్యంబుతోనిన్ను నేజంపఁగా నెంచి ముల్లోకముల్గూడ భీరుండవై డాఁగితే ఇప్పు డేదారినన్ బోదువోయంచు ఘోరత్వతం బల్కు యారక్కసుం గోళ్ళచేఁజీల్చి రక్తంబు పూరించి ప్రేవుల్ మెడన్ దాల్చి యున్నట్టి నీ రూపమున్ జూడ యీశాన బ్రహ్మాదిదిక్పాలకస్తోమముల్ లక్ష్మియున్ యాదిఁగాఁగల్గు వా రందఱున్ వచ్చి నిన్ జేరఁగా లేకభీతిల్లినన్ బాలుఁడైనట్టి ప్రహ్లాదుఁ డోస్వామి లోకంబు భీతిల్లె చేకూరె నీకార్య మోదేవ యీ దేవతా బృంద

ముౕ బ్రోవవే లోకముల్ గావవే నన్నురక్షించ
వే యంచుఁ బల్కంగ యబ్జాలునిౕ మెత్తి యం
కస్థలిౕ జేర్చి బాలా కృతార్థుండ వైనావురా
యంచు దీవించి శాంతించి లోకంబులౕ బ్రోవ
మారాక పురీ సీమలోనుండు ఉమ్మడ్వ రాఖ్యాక
మా గ్రామసామిప్యమందుండు శైలంబునౕ నిల్చి
లక్ష్మీనృసింహేశ్వరుండ్రిడౕ యోగినిౕ బ్రోచి స
ద్భక్తులౕ గాచి రక్షించు నీకీర్తివర్ణింప శక్యంబె
ఓ యీశ్వరా నిర్వికల్పప్రభావా ననుం బ్రోవవే
శ్రీశ ఈదండకం బెవ్వరైనౕ పఠించం గదుస్స్వ
ప్నదుర్దోషముల్ శాకినీ ఢాకినీ కామినీ మో
హినీ భూత భేతాళ బాధల్ నివారింప వే తంతు
లౕ దోలవే ద్వ్యాహిక త్ర్యాహికం బాదిగా గ
ల్గురోగంబులుౕ చోరతృష్ణాగ్ని సద్వాద్య నేకంబు
లౌదుష్టబాధల్ నివారించియుౕ ఒంటిగా బోవు
వేళౕ మఱిౕ నీటిలో గ్రుమ్మరుౕ వేళ రక్షిం
చి పుత్రాయురారోగ్యముల్ భాగ్యముల్ శా
శ్వతానంద కైవల్యముౕ యిచ్చి వేవేగ వారిౕ

ముదంబొప్పఁగాఁనేలు కృష్ణా మురారీ పురారాతి వంద్యా చిదానంద సన్మూర్తి ఆధారస్వాధిష్ఠమణి పూరకానాహతా యావిశుద్ధాగ్ని సాహస్ర చక్రంబులన్ విష్ణుహర్తా విధాతా హరీ రుద్రజీవా పరబ్రహ్మ శ్రీసద్గురుస్వాములన్ పేరుతో నుండు దేవా రమానాథ మాం పాహి మాం పాహి మాం రక్ష మాం రక్ష శ్రీనారసింహా నమస్తే నమస్తేనమః

శ్రీ లక్ష్మీసమేత ఉగ్రనరసింహార్పణమస్తు.

---

# శ్రీనరసింహపంచరత్నములు.

సీ. శ్రీధర భవహర చిన్మయ నలినాక్ష
కరుణాకర మహాత్మ గరుడగమన
పురుషోత్తమావ్యయ శరణాగత త్రాణ
బిరుదాంకితాచ్యుత నిరుపమాన
చక్రధారణ హరి శక్రాది పూజిత
నీలమేఘశరీర నిగమవంద్య

కాంచనచేల శ్రీకర చతుర్భుజ శౌరి
కౌస్తుభవక్ష శ్రీకంఠమిత్ర
తే. గీ. ఉరుగుణ విశేష యున్మాడిగిరినివాస
వజ్రనఖ తీక్ష్ణ దంష్ట్ర ధీవర ముకుంద
పరమపురుష పరాత్పర శరధిశయన
శ్రీరమాధవ ననుగావు శ్రీనృసింహ. 1

సీ నీనామ జపముచే నిఖిల గ్రహంబులు
పారిపోవునుగదే వారిజాక్ష
నీస్మరణంబుచే నిఖిల ప్రయోగముల్
సమసిపోవునుగదే శంకర సఖ
నీదు ధ్యానంబుచే నిఖిల రోగంబులు
మానిపోవునుగదే మంజుభాష
నిన్నుం దలంచగా నిఖిలపాపంబులు
భస్మమైపోగదే పరమపురుష
తే. గీ నీదుకీర్తనచే తనునిధిలభించు
నిన్ను పూజించుజన్మంబు నిర్మలంబు
గాన నిన్ను స్మరించెద గరుడగమన
శ్రీరమాధవ ననుగావు శ్రీనృసింహ. 2

సీ. నరసఖ నిన్మది నమ్మితిరక్షింపు
సర్వగ్రహంబుల సంహరింపు
యంవ్వనగ్రహముల జివ్వము గోళ్ళచే
కామినీ గ్రహముల గర్వమణచు
దుష్టగ్రహంబుల దూరంబుగానెట్టు
పాపగ్రహంబుల పారద్రోలు
చిక్కని గ్రహముల నుక్కణగించుమీ
పైశాచములనెల్ల పట్టికొట్టు
తే గీ. బ్రహ్మరాక్షసులను నెల్ల భంగపెట్టు
క్రూర గ్రహములనెల్లను బీరమణచు
వందనంబొనరించెద సుందరాంగ
శ్రీ రమాధవ ననుగావు శ్రీనృసింహ. 3
సీ. అందమై సచ్చిదానందమై కనులకా
నందమైయొప్పు నీ సుందరంబు
దట్టమౌ పట్టు చే గట్టిగా నేసిన
బట్టచే గప్పబడ్డట్టి భుజము
నిడుదలై నడిరేయి నడిచెడివారల
కడిదంబులైయొప్పు హస్తయుగము

దివ్యమై సజ్జన సేవ్యమై గంగందా
జననంబునొందిన ఘనపదములు
తే. గీ. భక్తుల నయోక్తిచేతను యుక్తముగను
భుక్తిముక్తుల నిచ్చియు బ్రోచునట్టి
శక్తి యుక్తులు గలిగిన స్వామివచ్చి
శ్రీరమాధవ ననుగావు శ్రీనృసింహ. 4
సీ. ఉన్మాదివరమున సమ్మతితోనుండు
శైలాగ్రమున నీవుచక్క గాను
భక్తులకెల్లను భుక్తి ముక్తులనిచ్చి
శక్తిమంతులుగాను రక్తి సేయ
కర్మంబులెల్లను నిర్మలముగఁ జేయ
దుర్మదాంధులనెల్ల దున్మటకును
పైశాచములనెల్ల పట్టిశిక్షించను
తంత్రులనెల్లను ధరణిద్రొక్క
తే గీ. సగము నరరూపమై తక్కసగముసింహ
రూపమైయున్న సర్వేశ తాపసాది
పూజితా యిందువచ్చి యింపొందఁగాను
శ్రీరమాధవ ననుగావు శ్రీనృసింహ. 5

## శ్రీలక్ష్మీనరసింహ యోగివారి

# సీసమాలిక

శ్రీమించు మార్కాపురీ సీమలోపల
నుమ్మడి వరమున సమ్మదముగ
మాధ్వులలోపల మెఱివన్నె కెక్కిన
సాబాదువారి వంశంబునందు
ముప్పరు మూర్తుల మూలంబుగాకొని
లక్ష్మీనృసింహుడు లలిజనించి
రామావధూతను రమణతో గురునిగా
గైకొని నరసింహు కరుణవలన
నాసేతు హిమశైలమాదిగా గలయట్టి
సకల దేశంబుల సమతదిరిగి
పుట్టిన గ్రామంబు పొలుపొంద జూడంగ
నుమ్మడి గిరికి హితమ్ముతోడ
జేరియు యందుండు శ్రీరమాధిపుడైన
ఉగ్రనృసింహు యనుగ్రహంబు
పొందంగదలచియు పొలుపొంద నందుండి
ప్రాకార గోపురాల్పటిమతోడ
బాగుజేయించియు బ్రాహ్మణ సంతర్ప

ణంబుబు నిత్యము నమరసల్పి
సర్వగ్రహంబుల సంహారమును జేసి
సకల ప్రయోగముల్ సమయఁజేసి
భక్తులకెల్లను యుక్తంబు యగునట్లు
కారణంబిచ్చియు కరుణతోడ
శోళీపురంబున సుచిరంబుగశిష్య
కోటినిజూడంగ కోర్కెమీర
జని యిహసుఖములఁ జాలించి నిష్ఠతో
లంబికాయోగంబు లలి ధరించి
బాగుమీరెడి చైత్రబహుళ పంచమియందు
పరమాత్మ హృదయనిబద్ధుఁజేసి
తే-గీ. వెలుఁగులోపల వెలుఁగొందు నెలుఁగుకన్న
చంద్రలక్ష్మీనృసింహ యోగీంద్రదలఁచి
నుతులొనర్చెద సతతంబు నతులితముఁగ
నాయురారోగ్యములనిచ్చియరయుకొఱకు.
సర్వం శ్రీలక్ష్మీసమేత వుమ్మడివర
ఉగ్రనరసింహార్పణమస్తు.